Regd. No.
H. NL. 88
సంపుటి: 56
సంచిక: 18

# జమీన్ రైతు

స్థాపకుడు : నెల్లూరు వెంకట్రామానాయుడుగారు

సంపాదకుడు : నెల్లూరు శ్రీరామమూర్తి

3-6-88
శుక్రవారం
12 పేజీలు
75 పైసలు.

# వెంగళరావు రాష్ట్రంలో కాంగ్రెస్‌కు జవసత్వాలు కల్గించగలడా?

**మా హైదరాబాదు విలేఖరి**

ఆలస్యంగానైనా సరే పిసిసి అధ్యక్షుడుగా శ్రీ జలగం వెంగళరావును నియమిస్తూ ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధీ తీసుకున్న చర్యవల్ల కాంగ్రెస్ (ఐ) లోని వివిధవర్గాలవారు హర్షం ప్రకటిస్తున్నారు. 1983 ఎన్నికలనాటినుంచి తెలుగుదేశం పార్టీ చేతిలో వరుసగా పరాజయాలను చవిచూస్తూ దాదాపు అడుగంటిపోతున్నదనే స్థితిలో పార్టీవున్న తరుణంలో శ్రీ వెంగళరావును అధ్యక్షునిగా నియమించడం గుడ్డిలో మెల్ల వంటిదని వ్యాఖ్యానిస్తున్నారు. వెంగళరావును పిసిసి అధ్యక్షుడుగా చేయాలనే ప్రయత్నం ఈనాటిదికాదు. 1983 తర్వాతనుంచి నలుగుతూనేవుంది. అయితే 1977 లో వెంగళరావు శ్రీమతి ఇందిరాగాంధీతో విభేదించి దూరమైనతర్వాత ఆమె సన్నిహితుడుగా మారిన పలువురు రాష్ట్రనాయకులు ఎప్పటికప్పుడు శ్రీ వెంగళరావును పిసిసి అధ్యక్షుడుగా కాకుండా అడ్డుపడ్డారు. వెంకటస్వామిని పిసిసి అధ్యక్షుడుగా తొలగించి శ్రీ వెంగళరావును పిసిసికి నియమించాలని శ్రీమతి గాంధీ భావించారు. అప్పట్లో పంజాబ్ గవర్నర్ పదవికి రాజీనామా చేసి వచ్చిన డాక్టర్ చెన్నారెడ్డికూడా ఆ పదవికిపోటీపడి వెంగళరావుకు కాంగ్రెస్ (ఐ)లో సభ్యత్వమేలేదని అభ్యంతరం లేవదీయటంతో ఆపదవిని రాజశేఖర్ రెడ్డికి అప్పగించారు. ఆతర్వాత శ్రీమతి గాంధీ ఆహ్వానంపై శ్రీ వెంగళరావు కాంగ్రెస్ (ఐ)లో చేరారు. శ్రీ వెంగళరావు పిసిసి అధ్యక్షుడుగా వున్నసమయంలో తాను ఆయనకింద ప్రధాన కార్యదర్శిగా వుండడానికైనా సిద్ధంగావున్నానని ప్రకటించి శ్రీ వెంగళరావు వర్గం సహాయ సహకారాలతో పిసిసి అధ్యక్షుడైన శ్రీ రాజశేఖరరెడ్డి ఏనాటి తెన్నుతగలేని పట్లుగా పిసిసి అధ్యక్షపదవి తనకు మించిపోకుండా శ్రీయుతులు విజయభాస్కరరెడ్డి, భవనం వెంకటరాం తదితర నాయకుల సహాయంతో పదవిని కాపాడుకుంటూ వచ్చారు.

ఆంధ్రప్రదేశ్‌లో పార్టీని నడిపించగల స్తోమత శ్రీ వెంగళరావుకే వుందని శ్రీమతి గాంధీ గుర్తించినప్పటికి రాష్ట్ర నాయకుల ముఠా తగాదాల కారణంగా ఆమె ఆయనను పి.సి.సి. అధ్యక్షునిగా నియమించలేదు. పార్లమెంటు ఎన్నికలలో పరాజయం తర్వాత వెంగళరావును పి.సి.సి.కి నియమించాలని శ్రీ రాజీవ్ గాంధి అనుకున్నా కొందరు అగ్రనాయకుల ఒత్తిడి కారణంగా ఆ పని చేయలేకపోయారని అంటున్నారు. శ్రీ వెంగళరావును అసెంబ్లీ ఎన్నికలకు ముందు పి.సి.సి. అధ్యక్షుడిగా నియమించివుంటే పార్టీ ఇంత అధ్వాన్న స్థితిలో వుండేది కాదని, మరో 50 సీట్లయినా గెల్చుకుని శ్రీ రామారావుకు 'అడకత్తెరలో పోక' పరిస్థితి కల్పించేదని రాజకీయ వర్గాలవారు అభిప్రాయపడుచున్నారు.

ఏది ఏమైనప్పటికి శ్రీ వెంగళరావుకు పి.సి.సి. కిరీటం పూలపాన్పు కాదు ఎంతో గురుతరమైన బాధ్యతను ఆయన నిర్వర్తించవలసివుంది. ఒకప్పుడు ఆయన నాయకత్వం వహించినప్పుడు పార్టీలో ఇంతగా ముఠాలు లేవని. ప్రస్తుతం పార్టీని ముక్కచెక్కలుగ ముఠాలుగా చీల్చి పావుగ వాడుకునే నాయకులు

—కొరవ 8 పేజీలో



పూలపాన్పు కాదు!

# ఉపఎన్నికల ఫలితాలు చాటుతున్న వాస్తవాలు

ఉపఎన్నికల ఫలితాలు ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామారావుకు ఇంగు తినిపించినట్లు తెలుస్తున్నది. ఫలితాలను విశదంగా పరిశీలించిచూస్తే మొన్నటి ఉపఎన్నికల్లో ముఖ్యమంత్రి ప్రభావం, గ్లామర్ ఏమీ పనిచేయలేదనే సత్యం బోధపడుతుంది.

రాష్ట్రమంత్రులను కావలి, గుడివాడ నల్గొండ నియోజకవర్గాలకు కేటాయించి ధనబలం, పోలీసుబలగాల సహాయంతో రిగ్గింగ్ జరిపి ఎన్నికలు గెలవడానికి ఆయన వేసుకున్న పథకాలు చిత్తయి పోయాయని రాజకీయవర్గాలవారు వ్యాఖ్యానిస్తున్నారు. కావలిస్థానంలో 8 వేలకు పైగా ఓట్ల తేడాతో కాంగ్రెస్ చేతిలో ఓటమిపొందడాన్ని తెలుగుదేశంపార్టీ ఘోరమైన అవమానంగా భావిస్తుంటే నిరాశా నిస్పృహలతో కొట్టుమిట్టాడుతున్న కాంగ్రెస్‌పార్టీవారు గెలుపుపట్ల తలఎత్తుకొని తిరుగుతున్నారు. మార్చి ఎన్నికలో నల్గొండనుంచి 30 వేల మెజారిటీతో సాక్షాత్తు ముఖ్యమంత్రే గెలుపొందగా ఇప్పుడు ఆ స్థానాన్ని దాదాపు తన్ని తన్ను లొట్టబోయినట్లుగా 8 వేల ఓట్ల మెజారిటీతో తెలుగుదేశం గెలుచుకున్నది. ఇది గెలవడం తెలుగుదేశం ఘనతేమీకాదు సి.పి.ఎం. పార్టీ హృదయపూర్వకంగా పనిచేయకపోతే ఇక్కడ

మా విలేఖరి
(హైదరాబాదు)

ఆపార్టీ ఓటమి చవిచూచి ఉండేది. ఇక గుడివాడలో గెలుపు రామారావుది కానే కాదు. ఆ గెలుపు పూర్తిగా రావి శోభనాద్రి చౌదరిదని అనుకోవచ్చు. శోభనాద్రి చౌదరి పార్లమెంటు ఎన్నికలసందర్భంలో రామారావుపై ఆగ్రహించగా అప్పుడు కాంగ్రెస్ (ఐ) ఆ నియోజకవర్గంలో 4500 ఓట్ల మెజారిటీతో గెలిచింది. పరిస్థితి గ్రహించి రామారావు చౌదరిని మచ్చికచేసుకొని అసెంబ్లీ ఎన్నికల్లో అక్కడనుంచి పోటీ చేసి 7500 ఓట్లమెజారిటీతో గెలిచారు. ఇప్పుడు రామారావును తలదన్నే విధంగా శ్రీ చౌదరి 21 వేల ఓట్ల మెజారిటీతో ఉపఎన్నికలో గెలిచారు. గుడివాడలో గెలిచినందుకు సంతోషపడవలసింది పోయి శ్రీ చౌదరికి తనకంటే ఎక్కువ మెజారిటీ వచ్చినందుకు రామారావు క్షోభపడుతున్నారని అంటున్నారు.

ఇకపోతే మక్తల్‌లో జనతా అభ్యర్థి శ్రీ సి నరసిరెడ్డి అందరికంటే ఎక్కువగా 25 వేల ఓట్ల మెజారిటీతో గెలిచారు. ఇక్కడ శ్రీ రామారావే ఆయన తరపున ప్రచారం చేశారు. అయితే శ్రీ రామారావు ప్రచారం చేయకపోయినా తక్కువ మెజారిటీతోనైనా శ్రీ నరసిరెడ్డి గెలిచేపరిస్థితి మక్తల్‌లో వుండింది. ఎందుకంటే నియోజకవర్గంలో అత్యధిక సంఖ్యలో వున్న తన కులస్తుల (తెలగ) సహాయంతోనే శ్రీ నరసిరెడ్డిపై లోగడ రెండుసార్లు గెలిచిన కాంగ్రెస్ (ఐ) అభ్యర్థి నరసింహనాయుడు ఈసారి తనకులస్తుల అసంతృప్తికి గురయ్యాడు. వారంతా నరసింహనాయుడును కాదని నరసిరెడ్డికి ఓట్లు వేశారు. ఈ పరిస్థితి పార్లమెంటు ఎన్నికల సమయంలో అక్కడ స్పష్టమైపోయింది.

## పినాకిని తీరం

### ప్రధాని రాజీవ్. జనార్దనరెడ్డి

శ్రీ జనార్దనరెడ్డి 30 తేది ఢిల్లీలో ప్రధాని రాజీవ్ గాంధీని కలుసుకున్నట్లుంది.

సంభాషణలు సరిగా తెలియడం కాని జనార్దనరెడ్డిగారిలో సంతోషం ఉత్సాహం తొణికిసలాడుతున్నట్లున్నాయి, అదీ సంగతి!

### రికార్డు సృష్టించడానికట!

కలెక్టరు కుమారి సుజాతారావుగారిని గూర్చి గతవారం వ్రాసినదానిపై ఒకరంటున్నారుగదా-

"ఆమెకు శాశ్వతంగా నెల్లూరులోనే వుండిపోవాలనే కోర్కె ఏమీలేదు, మరో పదిహేను రోజులో ఏమో పనిజేస్తే, ఇప్పటికి ఎక్కడా ఏ కలెక్టరూ ఒకచోట ఇంతకాలం పనిచేయనన్నిరోజులు చేసినట్లవుతుందట; అంటే కలెక్టరు గిరికి సంబంధించి సుజాతారావుగారు రికార్డు సృష్టి చినవారవుతారట; ఆ కీర్తికోసం ఆమె నెల్లూరును అంటిపెట్టుకొని వుంది కాని; మరే కారణంతోనూ కాను" —ఇదీ ఆవ్యక్తి ఇచ్చిన సంజాయిషీ!

చరిత్ర సృష్టించడానికైతే మనమూ సంతోషిద్దాం!

### నాయుడుగారు అజ్ఞాతవాసా?

జిల్లాకాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ మన్నెం వెంకటరత్నంనాయుడుగారి రాజకీయ అనుబంధాలేమిటి? ఆయన కాంగ్రెస్‌లో వున్నాడా, లేదా? జిల్లాకాంగ్రెస్ అధ్యక్షుడుగా కొనసాగుతున్నాడా, లేదా? మరేదైనా పార్టీతో సంబంధం ఏర్పరచుకున్నాడా, లేక అసలు రాజకీయాలనే త్యజించి అజ్ఞాతవాసి అయిపోయాడా?

ఇవన్నీ నాలో ఉత్పన్నమవుతున్న ప్రశ్నలు కాదు, నాలో కలుగుతున్న అనుమానాలూ కాదు. ఎన్నికల ఓటమి అనంతరం నాయుడుగారు చేసిన ప్రకటన తర్వాత ఆయన ఏమి చేస్తున్నాడు? ఎక్కడున్నాడు? ఆయన రాజకీయాలేమిటో తెలిసికోవాలనే కుతూహలం పెక్కుమందిలో ద్యోతకమవుతుంది. కాని ఈ ప్రశ్నలకు, అనుమానాలకు సమాధానంచెప్పడానికి నావద్ద ఏమీ సమాచారం లేదు.

ఎన్నికల తర్వాత ఆయన కనపడలేదు; పత్రికా ప్రకటనద్వారా తెలుసుకోవడం తప్ప జిల్లా కాంగ్రెస్ అధ్యక్షతకు వ్రాతపూర్వకంగా రాజీనామా ఇచ్చినట్లు దాఖలా ఎక్కడా లేదు; తిరిగి తెలుగుదేశం పక్షాన కావలిలో ఆ పార్టీ అభ్య

—కొరవ 10వ పేజీలో

# జమీన్‌రైతు

## ఏమి మునిగిపోయింది?

30 తేది సమావేశమైన ఆంధ్రప్రదేశ్ శాసనసభ శాసనమండలిని రద్దుచేయవలసిందిగా రెండవసారి కోరుతూ తీర్మానించింది. కౌన్సిల్ వుంటవి పోవి దాన్ని గూర్చి ప్రస్తావించడంలేదు; కౌన్సిల్ రద్దుకు ప్రధాని రాజీవ్‌గాంధి సమ్మతించి పార్లమెంటుచేత ఆమోదింపజేసి ముఖ్యమంత్రి ఎన్టీ రామారావు తన పంతం నెగ్గి చూడగలిగామనిపించి తన హయాంలో ఆంధ్రకాంగ్రెస్ వాదులను రెండవసారి అవమానానికి, ఆవేదనకు గురిచేసినా విమర్శించలేకపోవడంలేదు.

కాని రాష్ట్రాన్ని కలవరపరుస్తున్న, ప్రజలను దురవస్థల పాల్జేస్తున్న సమస్యలు అనేకం వుండగా, వాటిన్నిటిని వెనకకు నెట్టి, అసలు సాంప్రదాయ విరుద్ధంగా కూడా ముందు ప్రకటించకుండా మిత్రపక్షాలు కోరినా, నెత్తినోరు బాదుకున్నా, వారి సలహాను పెడచెవినిపెట్టి ఆ సమస్య అనేదిని చర్చకు తీసుకోకుండా, శాసనసభను పొడిగించకుండా, కౌన్సిల్ రద్దు తీర్మానంతో సభను నిరవధికంగా వాయిదా వేయవలసిన అవసరం ఏమికలిగింది? కౌన్సిల్ రద్దుతో ఏమి మునిగిపోయింది? అనేవే ప్రశ్నలు. కౌన్సిల్‌కు సంవత్సరానికి 38 లక్షలు ఖర్చవుతున్నదట; అది మిగిలించడానికట రద్దు తీర్మానం; కొబ్బరిచెట్టు ఎందుకు ఎక్కావంటే దూడ గడ్డికి అన్నట్లుగావుంది ఈ సమాధానం. ఒక్క కౌన్సిల్ రద్దు తీర్మానంకోసం శాసనసభ సమావేశాన్ని ఏర్పాటు చేయడానికి ఎంత ఖర్చయింది? ఇటువంటివి పొదుపు సద్దు క్రిందకు రావా? రామారావుగారికి జరుగుతున్నది: జరపుకొంటున్నారు; జరిగినన్ని రోజులు ఇంకా జరపుకొంటారు. ముఖ్యమంత్రి వైఖరికి, విధానాలకు సంబంధించి ఇక ఆ విధంగా అనుకొని సరిపెట్టుకోవడం మర్యాద.

నాటిక తడుపుకోడానికి నీరు లేవు; దుర్భిక్షం, పండించిన ధాన్యానికి ధర లేక, అన్నిరకాల పన్నులు, బిల్లులు, శిస్తులు, రుణాలు బకాయీల వసూళ్ళ ముట్టడితో రైతు దిక్కుతోచని స్థితి, ప్రజారోగ్యానికి తగిన వసతులు లేవు; ప్రాజెక్టులకు పైసలు లేవు; జీవితావసర వస్తువుల ధరలు అదుపుతప్పి, జీవితాలు దుర్భరమయ్యాయి; శాంతిభద్రతల పరిస్థితి మరీ క్షీణించింది; ఎం. ఎల్. ఎ. ప్రాణానికి వట్టినగరే భద్రత లేకుండాపోయింది.

ఆందోళన, అలజడి కల్గిస్తున్న ఇటువంటి సమస్యలు అసంఖ్యాకం. ఇటువంటి సమస్యలను గూర్చి చర్చించడానికి శాసనసభ్యులకు అవకాశం కల్గించకపోవడాన్ని ఏమనుకోవాలి? వీటన్నిటికంటే కౌన్సిల్ రద్దు అంత ప్రధాన సమస్యా? ఆ కటాక్షణం పరిష్కరించవలసిన ప్రమాదకరమైన సమస్యా? వాయిదా వేస్తే మునిగిపోయే సమస్యా? రామారావుగారి దుందుడుకు విధానాలను ప్రజలే గ్రహించాలి.



# కావలి ఓటర్లకు జేజేలు!

కావలి నియోజకవర్గం నుండి కాంగ్రెస్ అభ్యర్థిగా విజయంపొందిన శ్రీ కలికి యానాదిరెడ్డికి నా హృదయపూర్వక అభినందనలు.

మంత్రులందరును, శాసనసభ్యుల సైన్యాన్ని, ఇతర అన్నిరకాల వికలాంగ దౌర్జన్యశక్తులను తన స్వశక్తితో ఎదిరించి అధికారపక్ష దురహంకారులకు ఘోరపరాజయం చవిచూపించి చివరకు ముఖ్యమంత్రి రామారావునే ఓడించాడు యానాదిరెడ్డి, అటువంటి యానాదిరెడ్డిని "నెల్లూరు టైగర్" అని పిలవడం సముచితంగా వుంటుందని నా అభిప్రాయం.

యానాదిరెడ్డి నిగర్వి, పదవివ్యామోహం లేకున్నా ప్రజలమధ్య వుండేమనిషి. అందువల్లనే యానాదిరెడ్డికున్న ప్రజాభిమానం, ప్రజాదరణ అసాధారణమనే చెప్పాలి ప్రజాసాన్నిహిత్యమే యానాదిరెడ్డికి మొన్న ప్రతిష్ఠాకరమైన విజయాన్ని చేకూర్చింది.

పొల్లుఇస్కపల్లి —శ్రీనివాసులు

### జేజేలు

కాంగ్రెస్ కు అఖండవిజయాన్ని చేకూర్చి, తెలుగుదేశానికి, దాని నాయకులకు కనువిప్పు కలిగించిన కావలి నియోజకవర్గం ఓటర్లకు జేజేలు చెప్తున్నాము; జిందాబాద్ అంటున్నాము.

అంతమంది మంత్రులు, అధికార ప్రముఖగణమంతా అక్కడ మకాంవేసి అధికారాన్ని దుర్వినియోగంచేసినా, ముఖ్యమంత్రిగారే స్వయంగావచ్చి ప్రచారంచేసినా కావలి ఓటర్లు కాంగ్రెస్ అభ్యర్థినే గెల్పించారంటే అది తెలుగుదేశానికి ఒక గుణపాఠం. ఆనియోజకవర్గంలో యానాదిరెడ్డిగారిపట్ల కాంగ్రెస్ సంస్థపట్ల ప్రజలకువున్న అభిమానానికి



నిదర్శనం. కావలి ఓటర్లకు నా అభినందనలు.

కలిచేడు — షేక్ మహబూబ్‌బాషా

### రామారావుకు ఎదురుదెబ్బ!

కావలిలో కాంగ్రెస్ విజయం, తెలుగుదేశం ఓటమి ముఖ్యమంత్రి ఎన్టీ రామారావుగారికి ఎదురుదెబ్బ; ఇందులో అణుమాత్రం అనుమానం లేదు.

ఇక్కడ ఓటమి అభ్యర్థి వెంకటనారాయణది కాదు; ముఖ్యమంత్రి రామారావుగారిదే, పిచ్చుకమీద బ్రహ్మాస్త్రం ప్రయోగించినట్లు కాంగ్రెస్ అభ్యర్థి శ్రీ యానాదిరెడ్డిని ఓడించడానికి ఎంతమంది మంత్రులు, ఎందరు ఎం. ఎల్. ఏ. లు, ఎందరు ఎం. పి. లు, ఎందరు పి. ఐ. పి. లు, ఎంత అధికార వ్యామోహింపు? ఇదంతా చాలనట్లు ఆఖరున ముఖ్యమంత్రిగారి సుడిగాలి పర్యటన;

రామారావుగారు ప్రజలను గొర్రెల క్రింద జమకట్టారు; తన చెప్పునుపెట్టి గెల్పించగలననేంత దురహంకారాన్ని ప్రదర్శించారు. కావలి నియోజకవర్గం ఓటర్లు తాము గొర్రెలంకామని పరిణతి చెందినవారమని రుజువుచేశారు; రామారావు - ఓటమి ఎదురుదెబ్బ తీశారు. తెలుగుదేశం పతనానికి కావలి ఫలితం నాంది అని గ్రహించాలి.

అల్లూరు — సి. జి. రాజు

—కొత్త శివ పీడీలో

# కోటమ్మ దేవత పేరుతో వెలసిందేనా కోట గ్రామం?

కోట అనే పేరుగల గ్రామాలు దేశంలో అక్కడక్కడా చాలా వున్నాయి. రాజ పుటానాలో 'కోట' అనే ప్రదేశ సంస్థాన ముండేది. స్వాతంత్ర్యానంతరం, అది రాజస్థాన్‌లో విలీనమైంది. పిఠాపురం జిల్లాలో

**ఊరు–పేరు**
**వావింటపర్తి కృష్ణరావు**

కోటగిరి అనే వూరుంది. మన జిల్లాలో, వాకాడు తాలూకాలో 'కోట', సూళ్ళూరు పేట తాలూకాలో కోటపోలూరు అనే గ్రామాలున్నాయి. కోట సంస్కృత పదము. అంటే దుర్గము, దుర్గాదేవి. కోటమ్మ అనే మాటలకు అర్థం దుర్గము వలె కోటవలెరక్షించుదేవత అని. కోటయ్య, కోటమ్మ, కోటారెడ్డి అని పేర్లు పెట్టు కున్నవారు ఎక్కువమంది వున్నారు.

వాకాడుతాలూకా కోట

ఈ వూరిలో కోటమ్మ దేవాలయ ముంది. ప్రతి గ్రామములో ఏదో ఒక పేరుతో వెలసిన గ్రామదేవతే కోట గ్రామ ములో కూడా కోటమ్మగా వెలసింది. ఈమెను తొండవాడలో ముండాదేవియని, కలువాయిలో కలువాయమ్మ అని, మంగు ళూరులో మంగళేశ్వరి యని అంటారు. బ్రిటిష్‌వారు ప్రకటించిన "The manual of Administration in the Madras Presidency" అనే పుస్తకంలో కోట ప్రస్తావన వుంది. "Kota(San)-fort, the temple of Kotamma was built by Tondaman"

తొండ మండలము

పల్లవ రాష్ట్రమునకు తమిళ మున తొండై రాష్ట్రమని పేరు. ఇప్పటి నెల్లూరు మండలములోని దక్షిణభాగము, చెంగల్‌పట్టుజిల్లా అంతా, ఉత్తర ఆర్కాటు జిల్లాలో కొంతభాగము యీ తొండమండలములో చేరివుండినవి. పల్లవుల చరిత్ర గురించి, చరిత్రకారుల మధ్య అనేక అభిప్రాయాలున్నాయి. అవి యిప్పుడు యిచ్చట చర్చించలేము. నేను పుదుక్కోట మాజీ సంస్థానాధీశులను తొండ

–తరువాయి 11వ పేజీలో

# మొలగొలుకా, మలకెలకా?

డాక్టర్ అచ్చిరెడ్డిగారు నెల్లూరు మొలగొలుకు వడ్లను గురించి శాస్త్రీయంగానూ, రికార్డెడ్ ఎవిడెన్స్‌తోనూ జమీన్‌రైతులో ప్రకటించిన వ్యాసం 19-4-85 చాలా ఆసక్తిదాయకంగా వుంది. మొలగొలుకు వడ్ల వందసంవత్సరాల చరిత్రను పాఠకులకు ఎరుకపరిచారు అచ్చిరెడ్డిగారు వడ్లకు రెడ్లకు లెక్కలేనన్ని పేర్లున్నాయనే సామెతకూడా ఒకటుంది. అసంఖ్యాకంగా వున్న వడ్లజాతుల్లో మొలగొలుకు (మలకెలకు) ప్రత్యేకస్థానాన్ని సంతరించుకొన్నది.

ఈ మొలగొలుకులంపైరు ఏ ప్రదేశాన్నుంది. ఏ ప్రదేశానికి వచ్చిందో దీన్ని మొదటిసారిగా ఎవరు ప్రవేశపెట్టారో కూడా మనకు ఖచ్చితంగా తెలియదు. సాహిత్యంలో; ప్రత్యేకించి వ్యవసాయ సాహిత్యంలో కొన్నికొన్ని వడ్ల పేర్లు మనకు కనపడుతున్నా మొలగొలుకుల ప్రస్తావన మనకు కనపడదు.

వ్యవసాయసాహిత్యం, సామెతలు గురించి విశేషంగా పరిశ్రమించిన, నేదునూరి గంగాధరంగారుకూడా మొలగొలుకుల గురించి, దీన్ని పుట్టుపూర్వోత్తరాల గురించి యేమీ వ్రాయలేదు. దక్షిణ భారతదేశంలో నెల్లూరురైస్ అంటే మొలగొలుకు బియ్యం అనే అర్థంలోనే ప్రసిద్ధికెక్కింది. ఉత్తరదేశంలో కూడా నెల్లూరురైస్ అంటే చాలామందికి తెలుసు. అరునెలల పంటయిన యీ మొలగొలుకుపైరు దేశవ్యాప్తంగా ప్రఖ్యాతిచెందిందంటే దీనిలోని రుచి,పరిమళం యిందుకు కారణం.

కవికోకిల దువ్వూరి రామరెడ్డిగారు, దీనికి "మలకెలకు" అని పేరుపెట్టారని, ఇదే సరయినపేరని ఆయన అనేవారని ఆయన స్నేహితులు ఆయనతో పరిచయమున్నవారు చెపుతారు. మలకెలకే సరయిన పేరని మనం అనుకోవచ్చును. "మల" అంటే కొండ,తిప్ప, అడవి అని అర్థం, "కెలకు" అంటే, సమీపం, దగ్గర అని అర్థం. కొండల అడవుల సమీపంతో సెలయేళ్ళుపారే నెమ్ము కలిగిన ప్రదేశాల్లో నైసర్గికంగా యీ మొలగొలుకు మొలకి పైరుగా అయివుండవచ్చని అనుకోవడంలో అతిశయోక్తి ఏమీలేదు. కవికోకిలకూడా యిదే అర్థం చెప్పేవారు ప్రతిరి, మలకెలకే సరియైనమాట. "మొలగొలుకు" అనేమాటలో భాషాపరంగా అర్థమేమీలేదు. "మలకెలకు" వాడుకలో మొలగొలుకుగా మారిపోయి అదే పేరు రూఢిఅయి వుండవచ్చును, అరణ్యాల్లో, కొండదగ్గిర పెరిగిన యీ పైరుని, అరణ్యాల్లోనివసించేజనాభా దీన్ని ఆహార నిమిత్తం పైరుచేసి అభివృద్ధిచేసి వుండవచ్చుకూడా. ఇంతకంటే దీని పుట్టుపూర్వోత్తరాలు మనకు దొరకవు.

దీన్నిబట్టి మలకెలకుకు చాలా ప్రాచీనత వుంది. కొండల్లో కోనల్లో సంచరించిన ఆదిమవాసులకు దీన్ని గురించి తప్పక తెలిసివుంటుంది. డాక్టరు అచ్చిరెడ్డిగారన్నట్లు మనకు తెలిసింది దీని నూరుసంవత్సరాల చరిత్రే. అదవుండి, ప్రాచీనమండి, వర్లేలకు రాక ముందు మలకెలకుకు శతాబ్దాల వయస్సు తప్పక వుండితీరుతుంది. ఇది ఊహాగానమేమీకాదు.

**యరమాక ఆదిశేషారెడ్డి**

నూరుసంవత్సరాలతర్వాత ప్రకటించబడ్డ నిఘంటువుల్లో, మొలగులికి, మొలగులుకలు, మొలకొలుకులు అనే పేర్లు వున్నా. వీటికన్నిటికి "మలకెలకే" మూలరూపమని ఒప్పుకోకతప్పదు. మొలగొలుకు వడ్లగురించి 'జమీన్‌రైతు' పాఠకుల్లో జిజ్ఞాస రేకెత్తించిన డాక్టరు అచ్చిరెడ్డిగారు అభినందనీయులు.

——

మొలగొలుకుకు సంబంధించిన శ్రీ ఆదిశేషారెడ్డి డాక్టర్ అచ్చిరెడ్డి గారి వ్యాసమే చదివినట్టున్నారు. ఆ చర్చకు ప్రేరకమైన 29-?-85 సంచికలోని వ్యాసాన్నికూడా ఒకసారి చదువడం బాగుంటుంది. -సం.

# పల్లెలమీద రెవిన్యూశాఖ దండయాత్ర?

పల్లెమీద రెవిన్యూశాఖ దండయాత్ర ప్రారంభించిందా? రెవిన్యూ సిబ్బంది తాలూకాఫీసు కుర్చీలు వదలి పల్లెలంటూ పల్లెల దారి పట్టారట. మండుటెండలు, సాయంత్రానికి మొహం చిల్లవేసే వడగాడ్పులు హాయిగా, చల్లగా నీడన కూర్చొని తమతోపాటు వేంచేసిన ప్రజ పెట్టుకోవలసిందే కాని. భూమిమీద ఇవ్వ గలిగిన అధికారి ఎవ్వరూ లేరు.

ఈకొరతను తీర్చడానికి తాలూకాఫీసులకు తాళాలేసి సిబ్బందిని గ్రామాలకు కదలమన్నారట కలెక్టరమ్మ. వెనుకబడిపోయిన రెవిన్యూ కార్యకలాపాలని టీ పని చేయమని ఆదేశించిందట. వారు వేయ

గొంతుమీద కత్తి పెట్టడం ఎంతవరకు న్యాయమో, న్యాయమో ఆలోచించవలసి; రైతును ఒకేసారి గొంతు నినకవద్దని కోరుకున్నాము

## ఆత్మకూరు అవసరాలు - ముఖ్యమంత్రికి నివేదిక

మంత్రాలకు మామిడికాయలు రాలి వట్లా, నివేదికలకు పనులయ్యేట్లుంటే ఆత్మకూరు తాలూకా భూతల స్వర్గం కావాలి. కాంగ్రెసు నాయకుడు డాక్టర్ సుందరరామరెడ్డిగారి నవ్వేచూసి శేలిక మనిషి అనుకుంటారు. కాని కార్యశూరుడు, హైదరాబాదుకు పోతే ఒక్కక్షణం వూరుకుండరు. కాలికి బలపం కట్టుకొని ఓపిగ్గా ప్రతి ఆఫీసు ప్రదక్షిణం చేస్తారు. పనులు సాధిస్తారు.

మొన్న ముఖ్యమంత్రి రామారావుగారిని కలుసుకొని ఒక నివేదిక సమర్పించారట. తుఫానువల్ల గండ్లు పడిన

—తరువాయి 7 వ పేజీలో

21 తేది నెల్లూరులో జరిగిన ఆర్. ఎం. ఎస్. దాల్గవతరగతి వుద్యోగుల మహాసభలో ప్రసంగిస్తున్న ప్రాంతీయ నాయకుడు ఐక్కా వెంకయ్య-డి. రామసుబ్బారెడ్డి, ఎం. సుబ్బారావు, ఇండియన్ బ్యాంకి ఏజెంటు ఎస్. ఎన్. శర్మ, డివిజనల్ ప్రెసిడెంటు మురళీకృష్ణ, సెక్రెటరి ఎ. వి. రమణగార్లనుకూడా చిత్రంలో చూడవచ్చు.

### ... జిల్లా వార్తలు ...

అసలు కూర్చొమని చెప్పే మర్యాద కూడా తెలియకుండా తీరిగ్గా దర్జాగా కూర్చొని వుండే ప్రభుత్వ సిబ్బందిని పల్లెలకు పోయి ప్రతి ఒక్కరి గడప తొక్కి పని చేయమంటే అయ్యో అనిపిస్తున్నది, వీరికి ఇంతకంటే శిక్ష వేరే ఎందుకు అనిపిస్తున్నది.

రామారావుగారి మూర్ఖపు పుణ్యమా అని గ్రామ స్థాయిలో రెవిన్యూ కార్యకలాపాలు స్తంభించిపోయివున్నాయి. ఏ రికార్డు లేదు. ఏ వివరమూ చెప్పగలిగే వారు లేరు, ఏమి జరుగుతున్నది తెలిసినవారు లేరు. అంతా అస్తవ్యస్తమై పోయింది, అయోమయమైపోయింది. అక్కడక్కడ విలేజి అసిస్టెంట్లను నియమిస్తే వారి కాపురం టౌన్లలోనే, పల్లెలకు చుట్టపుచూపుగా ఎప్పుడొచ్చిపోతారో ఏమో తెలియదు. రెవిన్యూ ఇన్స్పెక్టర్లున్నారు, వారికి గ్రామాల్లో వుండే రికార్డు మంచి చెడ్డలు చూడటానికి పైన చాలదు. ఒక పట్టా వేయించు కావాలన్నా. ఒక సర్టిఫికేటు కావాలన్నా దేనికైనా దరఖాస్తు

పెని పనులు ఏవేవో అర్జెంటుగా తెలియదు, శిస్తువసూలు బకాయిలు, ఇండ్లస్థలాల బంజరుభూముల, ఒక్కటేమిటి సకలమూ చూడాలట ఈ వుద్యోగులు. ఒక్కమాటలో చెప్పాలంటే గ్రామస్థాయిలో రెవిన్యూశాఖను పూర్తిగా పునర్నిర్మాణం చేసివేయాలన్నమాట.

గ్రామాల ముఖ్య మొహం తెలియని ఈ సిబ్బంది ఏమిచేయగలుగుతుందిఅంటే పీకు పోయి పూడగొట్టబడిన పాత గ్రామాధికార్ల సహాయ సహకారాలపట్ల రించి తమపని చక్కబెట్టుకుంటారట. ఎంత సిగ్గుమాలినవారైతేమాత్రం పర్దాషీ జ్యంగా వీధులపాల్జేయబడిన గ్రామాధికార్లు ఎట్లా సహకరిస్తారు అని మీరు సందేహించనవసరం లేదు, కక్కుర్తిపడేవాళ్ళు కొందరుంటారు.

కలెక్టరమ్మ చేయిస్తున్న పని మంచిదే. కాని శిస్తుబకాయిలు, విద్యుచ్ఛక్తి బిల్లులు, సొసైటి బాకీలు, ప్రభుత్వ లోను, పంచాయితీ ఇళ్ళపన్నులు.... ఇవన్నీ కట్టమని ఒక్కసారి రైతు

# "భవిష్యత్ నాయకత్వానికి విద్యార్థులు సిద్ధంకావాలి"!

కాలేజిల. హైస్కూళ్ళ వార్షికోత్సవ వార్తలు విశేషంగా వస్తున్నాయి. కాని స్థలాభావంతో చెయ్యి ముడుచుకోవలసి వస్తున్నది.

### నర్రవాడ కాలేజి

నర్రవాడ డిగ్రీ కాలేజి వార్షికోత్సవం 10 తేది జరిగింది. ప్రిన్సిపాల్ శ్రీ పి. విశ్వనాధశర్మ అధ్యక్షించారు. శ్రీ ఆర్. వి. రామాంజనేయులు స్వాగతించారు. ముఖ్య అతిథిగా మాజీ ఎం. ఎల్. ఏ.

—తరువాయి 7 వ పేజీలో

# నెల్లూరు ముచ్చట్లు

## విమర్శకుడు

### పెరిటోనియల్ డయాలిసిస్

గుండెపోటులకు సంబంధించిన చికిత్సలో నెల్లూరు. పెరిటోనియల్ డయాలిసిస్ కూడా నెల్లూరులో సింధూర నర్సింగ్‌హోం. దాని అధినేత డాక్టర్ జి. రామచంద్రారెడ్డి రికార్డు సృష్టించడం విశేషం.

గుండెపోటు రోగులకు పేస్‌మేకర్ చికిత్సద్వారా మొట్టమొదటగా ప్రాణదానం జరిగింది 'సింధూర'లోనే; మొన్న 25 తేది పెరిటోనియల్ డయాలిసిస్ ద్వారా ఒక ప్రాణం కాపాడబడింది అక్కడే. డాక్టర్ రామచంద్రారెడ్డి ఇరవై గంటలు శ్రమించి - అది శ్రమకాదు, కోరి తపస్సే - ఒక ప్రాణికి కొత్త ప్రాణభిక్ష పెట్టారట.

మద్రాసువంటి మహానగరాలలో ఇవి చిన్నవి కావచ్చు; నెల్లూరువంటి మామూలు పట్టణాల్లో గొప్పవే. డాక్టర్ రామచంద్రారెడ్డి తప్పు కంటే ప్రాణానికి విలువ ఇస్తారు; అతని విజయ రహస్యం అందులోనే వుంది.

### టవున్ సి. ఐ.

నెల్లూరుటవున్ సి. ఐ. శ్రీ మురళి ధైర్యసాహసాలు అసాధారణమని చెప్పితీరాలి. కాని నేరనిరోధంలో, గూండాలతో మెలగడంలో ఆయన వైఖరి వరమ జగుప్సాకరంగా, మధ్యయుగపు మొరటుతనంగా, బ్రిటిష్‌కాలంనాటి పోలీస్ జులుం అవశేషంగా... ఒక్కమాటలో చెప్పాలంటే అవమానకరంగా వుంటున్నదని చెప్పడానికి విచారిస్తున్నాము.

కొట్టడం, దుర్భాషలాడడమేనా పోలీస్ ఆఫీసరు చేయవలసినవని? సభ్యత, సంస్కారం, మానవతా నాగరికత అలవరచుకుంటే పనిచేయలేరా, ఫలితాలు పొందలేరా?

కూరగాయలమార్కెట్ కాదానంపు బనేకాదు; అన్నిచోట్లా హాహాకారాలు, నిరసనలు ఆకాశాన్ని అంటుతున్నాయి. మురళిగారు తన సమర్థతను, చురుకుదనాన్ని, కరకుదనాన్ని, ధైర్యసాహసాలను ప్రజల ఇబ్బందికి గురవనంత అసహ్యకరం లేకుండా సార్థకంగా సద్వినియోగ పరచగలిగితే సంతోషిస్తాము.

ఈ విమర్శ, వ్యాఖ్య ప్రజాభిప్రాయ ప్రతిబింబమని మురళిగారు గమనించగలరని ఆశిస్తాము.

### ఎ. డి. బి. లకు కౌన్సిల్లాన్లు

జిల్లాలోని కొమ్మిది వ్యవసాయాభివృద్ధి బ్యాంకులకు అయా కౌన్సిల్లార్ల ఛైర్మెన్లుగా, సహకార సంఘాల సబ్ రిజిస్ట్రార్లు వర్సన్-ఇన్‌చార్జీలుగా నియమించబడ్డారు. అంటే ఇంతవరకు అవధికాల బోర్డుల నిర్వహిస్తుండిన బాధ్యతను ఈ ఇద్దరు అధికార్లు నిర్వర్తిస్తారన్నమాట.

ప్రజాస్వామ్య పునరుద్ధరణ అంటే రామారావుగారి అధికారం చెక్కుచెదరకుండడమనే భాష్యం చెప్పుకోవాలి!

### జాయింట్ కలెక్టరు

జాయింట్ కలెక్టరు శ్రీ వై. ఆర్. కృష్ణారావు కడపకు బదిలీ అయ్యారు. వారి స్థానంలో విజయవాడ సబ్ కలెక్టరు శ్రీ పి. దయాచారి నియమించబడ్డారు. ఇంకా రావుగారు పోలేదు; అదారిగారు రాలేదు.

ఏదువల్లనో ఐ. ఎ. ఎస్. యువకులు కొంచెం మిడిసిపాటుగా వుంటున్నారంది!

### హైదరాబాదుకు కొత్త ఎక్స్‌ప్రెస్

హైదరాబాదు రాకపోకలకు నెల్లూరీయులకు వారానికి మూడు రోజులు మరో ఎక్స్‌ప్రెస్ సౌకర్యం మే 1 తేదీ నుంచి లభించింది.

సూపర్ ఎక్స్‌ప్రెస్ ఒకటి బుధ, శుక్ర, ఆది వారాలలో మద్రాసు నుండి హైదరాబాదుకు ప్రయాణిస్తుంది; అది నెల్లూరు స్టేషనుకు రాత్రి 10-28 కి వస్తుంది. హైదరాబాదుకు మరురోజు ఉదయం 10-30 కి చేరుతుంది.

హైదరాబాదునుండి మంగళ, గురు, శనివారాలలో మద్రాసుకు బయలుదేరుతుంది, అది నెల్లూరుకు తెల్లవారుజామున 5-48 కి వస్తుంది. హైదరాబాదులో సా. 6-45 బయలుదేరి మరురోజు ఉదయం 9-30 మద్రాసు చేరుతుంది.

నెల్లూరునుంచి హైదరాబాదు ప్రయాణానికి పన్నెండుగంటలు తీసుకునే ఈ రైలుకు సూపర్ ఎక్స్‌ప్రెస్ అనిఎందుకు పేరుపెట్టారోమరి!

ఈ ఎక్స్‌ప్రెస్ సికిందరాబాదు ఖాజీపేట, ఖమ్మం, విజయవాడ, ఒంగోలు, నెల్లూరు, గూడూరులలోమాత్రం ఆగుతుందట.

### 'నాసా' క్రింద జయపాల్ నిర్బంధం

కాపలి పాలకుర్తి కోటయ్య హత్యలో మొదటి ముద్దాయిగా రిమాండులోవున్న కర్రెడ్డుల జయపాల్‌ను జాతీయ భద్రతా చట్టం (నాసా) క్రింద నిర్బంధించవలసిందిగా కలెక్టరు కుమారి సుజాతారావుగారు 2 తేది వుత్తరువు చేయగా, పోలీస్ అతనిని 3 తేది విశాఖపట్టణం సెంట్రల్ జైలుకు పంపింది.

ఇంతమంచి పనిచేసిన కలెక్టరుగారిని ఎంతగా అభినందించినా చాలదు!

### కొత్త డాక్టర్లు

డాక్టర్ టి. మురళీకృష్ణ ఎం. ఎస్. (జనరల్ సర్జరీ) 'శశ్వనీ క్లినిక్' పేరుతో 2 తేది మద్రాసు బస్‌స్టాండు ఎదురుగా వాహబ్‌పేటలోని మాత్యూస్ కొట్లలో క్లినిక్ ప్రారంభించారు. మురళీకృష్ణ మృదు స్వభావి; మంచివాడు, పెక్కుమంది మిత్రులు, శ్రేయోభిలాషులు హాజరై 'శశ్వని'కి విజయాకాంక్షలు తెలియజేశారు.

ం ం ం

డాక్టర్ ఆర్. వి. సుబ్రహ్మణ్యం ఎం. బి., డి. ఒ. "వాణి ఐ క్లినిక్" పేరుతో గత 25 తేది జమీన్‌రైతు ఆఫీసు ఎదురుగా నేత్ర వైద్యశాలను ప్రారంభించారు. సుబ్రహ్మణ్యం సౌమ్యుడు, నెమ్మదిమనిషి.

పై ఇరువురు డాక్టర్లకు మా అభివందనలు.

### ఎముకలడాక్టరు లేడు!

నెల్లూరు పెద్దాస్పత్రిలో డాక్టరు కృష్ణ బదిలీతర్వాత, అంటే గత ఐదునెలలుగా, ఎముకలడాక్టరు లేరు. రోగులు అల్లాడిపోతున్నారు.

వైద్య ఆరోగ్యశాఖ నిద్రపోతున్నదా?

### డి. డి. ఒ. కు చుక్కెదురు

వెంకటగిరి పంచాయతీ సమితి మేనేజరు శ్రీ వి. మల్లికార్జునరావు రిటైర్‌మెంటుకు సంబంధించి హైకోర్టు వుత్తరువును ధిక్కరించి మందలింపుతోబాటు రూ 50 లు జరిమానాకూడా విధించబడిన జిల్లా డెవలప్‌మెంటు ఆఫీసరు శ్రీ పి. శ్రీహరికి సుప్రీంకోర్టులోకూడా చుక్కెదురైంది: ఆయన అప్పీలును కోర్టు అడ్మిట్ చేసుకోలేదట. అంటే హైకోర్టు జరిమానాను సుప్రీంకోర్టు ధృవీకరించినట్లేలెక్క.

### ఎండ

ఈవారం ఎండ వివరం ఇదీ. ఈ సంవత్సరంలో ఇప్పటివరకు మే 1 తేది ఎండే ఎక్కువ. ఆ రోజు నెల్లూరు అరణ్యరుణమయమేగదా!

| | | | (ఫారెన్‌హీట్) |
|---|---|---|---|
| ఏప్రెల్ | 27 | తేది | 107 . 6 |
| | 28 | ,, | 105 . 8 |
| | 29 | ,, | 106 . 7 |
| | 30 | ,, | 108 . 5 |
| మే | 1 | ,, | 111 . 2 |
| | 2 | ,, | 108 . 5 |
| | 3 | ,, | 108 . 5 |

### నెల్లూరు బజారు

| | | |
|---|---|---|
| మొలగొలుకులు | పుట్టి | 1240.00 |
| ఐ. ఆర్. 20 | ,, | 1240-00 |
| 2608 | | 1200-00 |

### నీటిమట్టం

3వ తేది —

| | |
|---|---|
| కనిగిరి రిజర్వాయరు | 13,70 అ |
| సర్వేపల్లి ,, | 3 28 అ |
| నెల్లూరు చెరువు | 12-10 అ |

— —

నెల్లూరు న్యాయవాద సంఘ వార్షికోత్సవ సభలో ప్రసంగిస్తున్న హైకోర్టు న్యాయమూర్తి శ్రీమతి అమరేశ్వరి, ప్రక్కన సభాధ్యక్షు, జిల్లా జడ్జి శ్రీ శ్రీ సాంబశివమూర్తి

# న్యాయవాద వృత్తిలోకి స్త్రీలూ ఎక్కువగా రావాలి!

న్యాయవాద వృత్తిలోకి స్త్రీలు ఎక్కువగా వచ్చినట్లయితే వారి శక్తి సహస్త్రైపైకిగా గలరు! అందుకు తానే నిదర్శనమంటూ హైకోర్టు న్యాయమూర్తి శ్రీమతి కె అమరేశ్వరి, 27 తేది నెల్లూరు న్యాయవాద సంఘ వార్షిక సమావేశంలో ముఖ్య అతిధిగా పాల్గొన్న విస్తూ వుద్బోధించారు. సభకు జిల్లా జడ్జి శ్రీ బి శివసాంబమూర్తి అధ్యక్షత వహించారు.

"న్యాయవ్యవస్థ సక్రమంగా పని చేయాలంటే న్యాయమూర్తులు న్యాయవాదుల మధ్య సామరస్య సహకార సదవగాహ లవసరం. న్యాయవాదులు న్యాయ శాస్త్రాన్నొక్కదాన్నే అధ్యయనం చేస్తే చాలదు; రాజకీయ, ఆర్ధిక, సాంఘిక, మనస్తత్వ శాస్త్రాలను కూడా అధ్యయనం చాలి. న్యాయస్థానంలో కేసులు తీర్మానించడంలో విలంబనం జరుగుతున్నదంటే దానికి కారణం తగినన్ని న్యాయస్థానాలు ఏర్పాటు చేయకపోవడమే. న్యాయవాద వృత్తిలో దశాబ్దాలు, సంఘసేవకు కూడా స్థానం వుండాలి" అని శ్రీమతి అమరేశ్వరి తన ప్రసంగంలో వెలిబుచ్చారు.

న్యాయవాద వృత్తిలో అర్ధశతాబ్దం పూర్తిచేసిన శ్రీ కె. యల్. నారాయణరావు, శ్రీ డి.ని. నారాయణరావు సన్మానింపబడ్డారు. వారిని గూర్చి శ్రీ ఎం. సుందరాచారి, ఎం. చలపతిరావు గారలు ప్రసంగించారు.

కీర్తిశేషులైన న్యాయవాదులు అష్టకాల పట్టాభిరామయ్య, అల్లాడి సుబ్రహ్మణ్యం, మహమ్మద్ రజాక్ అలి, సి. దయాశేఖర్, వాదారి కళ్యాణ సుందరం గారల రూపపటాలు ఆవిష్కరింపబడ్డాయి. దివంగతులైన ఈ ముఖ్యులను గూర్చి శ్రీయుతులు గుర్రం వెంకటసుబ్రహ్మణ్యం, ఎం. సుందరాచారి శివరామ సుందరం, పి. వి. రమణారెడ్డిగారలు వుపన్యసించారు.

సెక్రటరీ శ్రీ పి. శేషాచలం స్వాగత వందనాదులు, హోస్ట్ శ్రీ ఎన్. సాంబు రంగారావు ఇమ్మని విందుతో బార్ వార్షికోత్సవం తృప్తిగా ముగిసింది.

# వార్షికోత్సవాలు

(5వ పేజీ తరువాయి)

శ్రీ ఎం. వెంకయ్యనాయుడు మాట్లాడుతూ విద్యార్థులు క్రమశిక్షణతో విజ్ఞానార్జనచేసి భవిష్యత్ నాయకత్వాన్ని స్వీకరించుటకు అర్హత సంపాదించుకోవాలని, యుద్ధానంతరం జపాను అంత అభివృద్ధి చెందిందంటే, ముఖ్యంగా ఎలక్ట్రానిక్స్‌లో ఆధిక్యత సంపాదించిందంటే, కారణం వారి క్రమశిక్షణ, పరిశ్రమే కారణమన్నారు. ప్రధానోపన్యాసకుడు ఉదయగిరి కాలేజి ప్రిన్సిపాల్ శ్రీ అదూరి కృష్ణమూర్తి విద్యార్థులు పరీక్షలలో అవినీతికి పాల్పడకుండా సక్రమ మార్గంలో వుత్తీర్ణులు కావాలని వుద్బోధించారు. కృష్ణమూర్తి గారికి ముఖ్యమంత్రి రామారావుగారి 'మిధ్యావాదం' వంటబట్టినట్లున్నది. విద్యార్థులు ఆ మార్గాన్ని అనుసరించకూడదని వ్యంగ్య సలహా ఇచ్చారాయన. అంటే ఏమిటో మరి!

కాలేజి దాత శ్రీ మైనంపాటి వెంకయ్య బహుమతి ప్రదానం చేశారు. శ్రీ వి. శ్రీరామచంద్రమూర్తి విద్యార్థుల సమస్యలను సభ దృష్టికి తెగా. శ్రీ ఎం. సుబ్బారావు వందనాలు సమర్పించారు.

## సెయింట్ పీటర్స్

నెల్లూరు- సెయింట్‌పీటర్స్ హైస్కూలును జావియర్ కాలేజిగా అభివృద్ధి పరచనున్నట్లు... వార్షికోత్సవసభలో ముఖ్య అతిధిగా పాల్గొంటూ సూచించారు. స్కూలులోని ప్రశాంత వాతావరణాన్ని, క్రమశిక్షణను శ్రీ శివసాంబమూర్తి ప్రశంసించారు.

సభకు బిషప్ శ్రీ పి. వి. బాలస్వామి అధ్యక్షత వహించారు. శ్రీ వై. పరశయ్య స్వాగతం పలికారు. నెల్లూరు డి. ఎస్. పి. శ్రీ లక్ష్మణమోహన్, కావలి ఉపవిద్యాశాఖాధికారి శ్రీ పి. నీలాంజనేయులు వుపన్యసించారు. హెడ్మాస్టరు శ్రీ వెంకటాద్రి స్కూలు ప్రగతిని వివేదించారు. సభాధ్యక్షులు శ్రీ బాలస్వామి విద్యార్థుల ఆధ్యాత్మిక చింతనను అలవరచుకోవాలని ప్రబోధించారు. శ్రీ జె. డి. సుదర్శనరావు వందనాలతో సభ ముగిసింది.

## ఊటుకూరు స్కూలు

రాపూరు తాలూకా ఊటుకూరు హైస్కూలు వార్షికోత్సవం బి డి ఓ. శ్రీ ఎం. జె. రాజరత్నం అధ్యక్షతన జరిగింది. హెడ్మాస్టరు శ్రీ ఎ. వేణుగోపాలరావు నివేదిక చదివారు. సైదాపురం సిండికేట్ బ్యాంకు మేనేజరు శ్రీ ఒ. బాలచంద్రారెడ్డి వుపన్యసించారు.

ఈ సంవత్సరం ఈ స్కూలు 7 వ... అయ్యారట. గుడ్!

## మంత్రిగారు పాల్గొన్న తుమ్మలపెంట!

సమరంకోసం ప్రజలు, అవకాశం కోసం మంత్రులు కాచుకొని వుంటారు. కావలి తెలుగుదేశం ఎలక్షన్ ద్వారా ఎన్నికయిన విద్యామంత్రి శ్రీ ఎం. ముద్దుకృష్ణమనాయుడు తుమ్మలపెంట బాలికల ఉన్నత పాఠశాల వార్షికోత్సవంలో పాల్గొన్నారంటే అంతేగదా!

సభకు మాజీ శాసనసభ్యుడు శ్రీ పి. వెంగళరావు అధ్యక్షించారు. మంత్రిగారు 75 వేల భవనానికి ప్రవేశోత్సవం జరిపారు. మంత్రిగారి అనుచరుడేమో సత్యవీడు ఎం. ఎల్. ఏ. శ్రీ ఎం. సి రాజా వుపన్యసించారు. డి. ఇ. ఓ శ్రీ మస్తానరెడ్డి, శ్రీ జి. కొండపనాయుడు సభలో పాల్గొనగా, ప్రిన్సిపాల్ శ్రీమతి డి. నాగభూషణమ్మ ధన్యవాదాలు చెప్పారు.

— —

## జిల్లా వార్తలు

(5వ పేజీ తరువాయి)

చెరువులు, ఎండిపోతున్న బావులు. నీరో రామా అంటున్న ప్రజలు మెట్టపంటల నష్టం వగైరా సమస్యలతోబాటు; సోమశిల ఉత్తరపుకాల్వద్వారా లక్ష ఎకరాలకు పారుదల వసతి కల్గించాలి; చిలుకల అనుమసముద్రం పికాలువకు నీరు అందేట్లు చర్యలు తీసుకోవాలని సుందరరామరెడ్డిగారు ముఖ్యమంత్రికి ఇచ్చిన నివేదికలో కోరారు.

### కోలగట్ల బావు

30 తేది పొలంలోని తన మోటారు వద్ద షాక్ కొట్టి ఏటూరు వెంకటసుబ్బారెడ్డి (25) అక్కడికక్కడే మరణించాడు. కరెంటు వస్తూపోతూ వున్నందట; అసలు లైనుతో సరఫరావుందో లేదో చూద్దామని గడను పెడుతుండినాడట; విద్యుదాఘాతంలో విసిరికొట్టబడ్డాడు. కరెంటుతో చెలగాటం ప్రాణానికిముప్పని గ్రహించాలి!

### కుడితిపాళెం చావు

గత 25 తేది కుడితిపాళెంలో ఎపిజి 3799 బస్ క్రింద గోళ్ళ రామయ్య కుమార్తె కామేశ్వరమ్మ పడి చనిపోయింది. ఆ అమ్మాయి బస్ ముందు వుండిందేమో, చూడకుండా డ్రైవరు బస్ కదిలించాడట; ఆ అమ్మాయి ముందుచక్రం క్రింద నేపడి నలిగిపోయింది.

### కావలి సంఘం

హెచ్. పి. గ్యాస్ వాడకందార్ల సంఘమంటూ ఒకటి ఏర్పడింది. శ్రీ శివప్రసాద్ దీని నిర్మాత. టవునులోని అన్నివర్గాలకుచెందిన ముఖ్యులు రెండు వందలకుపైగా ఇందులో సభ్యులుగా వున్నారు.

గ్యాస్‌కు సంబంధించి వినియోగదార్లు అనేక ఇబ్బందులకు గురియవుతున్నారు. ఏజంటు-వినియోగదార్ల మధ్య సమన్వయాన్ని సాధించి, సమస్యలు లేకుండా చేయడానికి ఏర్పడిన సంఘం ఇది ప్రతి పట్టణానికి సంబంధించి ఈ విధంగా వినియోగదార్ల సంఘాలు వుండడం ఎంతైనా అవసరం. లేకుంటే వినియోగదార్లు అన్యాయానికి గురియైపోతున్నారు.

### సవరణ

26-4-85 జమీన్‌రైతు 3వ పేజీ మెంటా సుబ్బారాయుడుశెట్టి బహిరంగ లేఖ ప్రకటన 7వ లైనులో 1980 సంవత్సరం బదులు 1983గా చదువుకోమనవి.

# ఇది బాపూ చిత్రమా ?

ఇది 'బాపు' చిత్రమా, అంటూనే చూస్తే వెంటనే అనిపించేది యిదివరకు, ఎందుచేతనంటే బాపు చిత్రాల్లో మంచి కథ, కథనము వుండేవి. కథ, కొత్తదనము కనపించేవి. సన్నివేశాల్లో సహజత్వము, పాత్రల్లో సున్నితత్వము సొంపులు దిద్దుకునేవి. మాటల్లో చెప్ప లేని మధుర భావాలు దృశ్యంలో కావ్యంలా గోచరించేవి.

కాని ఇటీవలి బాపు దర్శకత్వంలోని చిత్రాలు చూడబుద్ధికావటంలేదు. కారణం పైన చెప్పుకున్న అంశాలు లోపించడమే. తన చిత్రాలు దెబ్బతింటున్నాయని తండ్రి నడుమున్నట్లులేదు, తన లోపాలు సరిదిద్దుకొని పూర్వపు స్థాయి నిలబెట్టుకుందామన్న ప్రయత్నమూ, పట్టుదల ఆతనిలో వున్నట్లులేదు. ఇది ఇలాగే వుంటే 'జాకీ' లాంటి చిత్రానికి దర్శకుడుగా తయారవుతాడు. పొట్టకూటికోసం ఎలాంటి చిత్రమైనా సరే దర్శకత్వం వహించే అవకాశం చిక్కితేచాలువనే వగటు తెలుగుసినిమా దర్శకుల కోవలో బాపు చేరిపోయాడనిపిస్తుంది.

'జాకీ' చిత్రంలో ఎంతమాత్రము కథలో బలములేదు; కథనము కూడా అంతంతమాత్రంగానేవుంది.

జానకిరామయ్య (శోభన్‌బాబు) ఒక కోటీశ్వరుని (గుమ్మడి) ఏకైక ముద్దుబిడ్డ ముద్దుగా అతన్ని జాకీ అంటారు. ఇతనికి గుర్రపుస్వారి అంటే యిష్టం, అన్యాయాన్ని ఎదిరించటం దుర్మార్గులతో పోరాడటం అతని దినచర్య. ఇతని మేనత్తకూతురు రాణి (శ్యామలగౌరి) తో వివాహం నిశ్చయిస్తాడు తండ్రి. అందుకు ఆమె యిష్టపడకపోగా జాకీని ఈసడిస్తుంది. తండ్రి సంపాదించిన డబ్బును చేతికొచ్చినట్టు ఖర్చు పెట్టటం కాదు. కష్టపడి ఒక్కరూపాయ సంపాదించి చూపెట్టమని ఈ ఆస్తి నదలి బైటకొస్తే కష్టపడి రూపాయి పావలా సంపాదించి చూపెట్టగలిగితే తన్ను వివాహ మాడటానికి సిద్ధమని రాణి ఒక్క సినిమా సవాలుతో జాకీ కన్ను తెరుస్తాడు.

> ## జాకీ
> ### సమీక్ష
> ❖
> ### గ్రిద్దలూరు గోపాలరావు

తానూ కష్టపడి సంపాదించి, డబ్బును చూపిగాక తననుతానుగా ప్రేమించే అమ్మాయిని వివాహం చేసుకోవాలన్న నిర్ణయంతో ఇల్లు వదిలి వెళ్తాడు. ఒక రిటైర్డు మిలిటరీ ఆఫీసరు (రావుగోపాలరావు) వద్ద పాలేరుగా చేరుతాడు. ఆఫీసరు కూతురు సీత (సుమలత) జాకీని ప్రేమిస్తుంది.

ఆ వూరి జమీందారు కూతురు జానకి (మహాలక్ష్మి) జాకీలాగ గుర్రపుస్వారి చేస్తూ విచ్చలవిడిగా ప్రవర్తిస్తూ వుంటుంది జాకీ ఒక సన్నివేశంలో జానకిని ఎదిరిస్తాడు. జానకి జాకీపై పగ సాధించాలంటుంది, జాకీ జానకి అహాన్ని అణచి కనువిప్పు కలిగిస్తాడు జానకి తన పశ్చాత్తాపంతో జాకీని వివాహ మాడుతుంది.

కథలో ఎక్కడా సహజత్వం కనిపించదు, ఇక సన్నివేశాలా అంతే, చిత్రం ఫైటింగులతో ప్రారంభమై, చాలాభాగం ఫైటింగులతోనే నిండిపోయింది.

జాకీ పాత్ర చిత్రంలో చాలాభాగం ఆక్రమించుకుంటుంది. ఈ పాత్ర చాలా లోపభూయిష్ఠంగా చూపబడింది. మొదట్లో జాకీ అన్యాయాన్ని అతికష్టంతో పోరాడి అందర్ని రక్షిస్తాడు, కాని ఏనుగును చూచి భయపడటం, దాని తొండాన్ని చూచి ఏదో కాంచి అమాయకత్వం వెలిబుచ్చటం, అదే విధంగా తన గదిలో తన పడకమీదికి పాము వచ్చినప్పుడు పిరికివాడులా కంపించిపోవటం యిలాంటి సంఘటనలు ఆపాత్ర ఔన్నత్యాన్ని దెబ్బతీసేవిగా వున్నాయి.

జానకి పాత్రకూడా విడ్డూరంగా కనిపిస్తుంది. రోజూ గుర్రంస్వారీ చెయ్యటం బాగానే వుందనుకోండి. తాను ఎంత శ్రీమంతురాలైనా తన గుర్రాన్ని అధిగమించి పరుగుతీసే కార్లనంతా జలపంతంగా పోవటం. ఆ డ్రైవర్లను గుంజిలు గొరిగించి రోజుకు వందసార్లు వలాం చెయ్యించుకోవటం. తన కాళ్ళకు మొక్కని ఏనుగును కొని బలవంతంగా తన బంగళాకు తీసుకపోవటం పగంఆట జరిగిన తర్వాత సినిమాహాలుకుపోయి మరలా మొదటినుంచి ఆట వెయ్యమనటం, అలా వెయ్యనిరాకరించినందున ఆ సినిమాహాలు బలవంతంగా కొనెయ్యటం యిలాంటి అహంకారపు చేష్టలు కొన్ని వికారంగా కనపిస్తాయి.

జాకీగా శోభన్‌బాబు చలాకీగా నటించాడు. సీతగా సుమలత పాత్రోచితంగా నటించింది, జానకి పాత్ర సుహాసినికి సరిపోలేదు, ప్యాంటు వేసినప్పుడు వెగటుగా కనపించింది మిగతా పాత్రలు చెప్పుకోతగ్గవికావు.

—కొనవ 11వ పేజీలో

## "కళాబంధు సుబ్బరామరెడ్డి"

కేంద్ర ఫిలిం సెన్సార్ బోర్డు సభ్యుడు తిక్కవరపు సుబ్బరామరెడ్డి నిజంగా సినీ కళాబంధువే. సెన్సార్‌బోర్డు సభ్యుడు కాకపూర్వంనుంచికూడా సుబ్బరామరెడ్డి చిత్రకళాకారంగానికి ఆత్మబంధువే. అందువల్లనే మొన్న మద్రాసు "కళాసాగర్" ఆంధ్రప్రదేశ్ గవర్నర్ డాక్టర్ శంకరదయాళ్‌శర్మ చేతిమీదుగా "కళాబంధు" బిరుదాన్ని బహూకరించి సరైన వ్యక్తిని సముచితంగా సన్మానించింది. ఆచిత్రమే ఇది.

## నాటకంగా 'త్యాగయ్య'

సంగీత కచ్చేరీలలోనో, హరికథలలోనో తప్ప 'త్యాగయ్య'ను స్మరించటం, రూపం దర్శించుకోవడం మనకు అలవాటులేదు. ఎప్పుడో 1940 ప్రాంతాలలో యుద్ధనిధి వసూలుకుగాను అప్పటి కలెక్టర్ ఆర్.గెంటి గూడూరులో త్యాగయ్య నాటకం ప్రదర్శింపజేశారు. ఆ తర్వాత పండితారాధ్యుల సాంబమూర్తిగారు ఒకసారి త్యాగయ్య నాటకం ప్రదర్శించారు.

త్యాగయ్య పాత్ర ధరించడానికి సంగీత పాండిత్యం, నటనానుభవం పుష్కలంగా కావలసిరావడంతో సాధారణ నటులెవ్వరూ అందుకు సాహసించలేదు. అయితే మొన్న 6 తేది నెల్లూరులో పూర్తిస్థాయి నాటక రూపంలో త్యాగయ్య కథను ప్రదర్శించారు.

రిటైర్డ్ ఉద్యోగి శ్రీ మైనంపాటి వెంకటరామకృష్ణరావు ఇందులో త్యాగయ్యగా నటించారు. అయితే ఆయనకు సంగీత పరిజ్ఞానంలేదు. నాటకరంగంలో పెద్ద సాహసం ఇది. అయితే ఆయన పట్టుదలతో దర్శకుని ప్రతిభోతాని, నాటకంమాత్రం బాగానే రక్తి కట్టింది.

> **లఘుసమీక్ష**

విగ్రహాలు కోల్పోయి, విలపించలేని దుఃఖోద్వేగభావంలో ముఖారి రాగంలో 'హరి నేనెందు వెదకుదురా' కీర్తనపాడే సన్నివేశం ప్రేక్షకులను

—కొనవ 11 వ పేజీలో

**N. B. K. R. Campus School**

(ENGLISH MEDIUM)

VIDYANAGAR -524 413, Nellore Dt. (A. P.)

Applications are invitad for the posts of

(a) HEADMASTER/HEADMISTRESS
(b) TEACHERS

QUALIFICATIONS & EXPERIENCE: Trained graduates in Humanities/Sciences preferably with experiance in play-way mathod of teachting-learning process. New graduates having teacher training cartificates may also be considered. Condidates with fluency in Englsh will be preferred. Retied teachers may also apply.

Salary :- Commensurate with qualifications and experience.

Applications on plain paper giving full datails along with the copies of testimonials and certificates should reach the Correspondent of the school on or before 22nd May. 1985.

26th April, 1985. -CORRESPONDENT

చెఱకు ఉత్పత్తిదారుల సమావేశము

## ఆహ్వానము

నెల్లూరు జిల్లాలో చెఱకు ఉత్పత్తిచేయు రైతులందరూ రాజకీయ పార్టీలకు అతీతంగా ఒక అసోసియేషన్‌గా ఏర్పడి చెఱకు పండించు రైతుల ఎదుర్కొను సమస్యలను చర్చించి ఆ సమస్యల పరిష్కారమార్గాలు వెదకుటకుగాను 9-5-85 బేస్తవారము సాయంత్రం 3 గంటలకు నెల్లూరు టౌన్ హాలునందు (L P Hall) సమావేశము జరుపుదురు. కావున నెల్లూరు జిల్లాలో చెఱకు పండించు రైతులందరూ ఈ కార్యక్రమాన్ని తమ స్వంత కార్యంగా భావించి సమావేశమునకు హాజరై మన సమస్యలు వాటి పరిష్కార మార్గములు చర్చించి సమావేశమును జయప్రదం చేయవలసినదిగా కోరుతున్నాము.

ఆహ్వానసంఘం

## బహిరంగ వేలము నోటీసు

మెంటా సుబ్బరాయుడుశెట్టి

(P. B. L. No. 79/69-70)

12/1585, గిడ్డంగివీధి, చిన్నబజారు, నెల్లూరు-1

వారి వద్ద 1979 జనవరి, సెప్టెంబర్, నవంబర్, 1980 అక్టోబర్; 1981 జూన్, జులై, అగస్టు, నవంబర్, డిసెంబర్; 1982 జనవరి, ఏప్రెల్, జులై, అగస్టు, అక్టోబర్, నవంబర్; 1983 జనవరి, మార్చి, జులై, అగస్టు మరియు 1984 ఫిబ్రవరినెలల్లో కుదువవున్నది, విడిపించుకొనని, కాలపరిమితి దాటిన, ఆక్షన్ క్యాటలాగులో వివరించిన, కుదువ నగలు 29-5-1985 తేది ఉదయం 10గంటలనుండి మధ్యాహ్నం 1 గంటవరకు పై అడ్రసునందు నాచే బహిరంగవేలముద్వారా విక్రయించబడును.

బి. వెంకటేశ్వర్లు

జిల్లా వేలముదారు. (కుదువ వస్తువులు) జన్నవాడ-524 331



# పినాకినీతీరం

(2వ పేజీ కొరవ)

ర్తికి ప్రచారం చేసిన శ్రీ అంకయ్యగార్ శ్రీ నాయుడుగార్ల స్నేహం వ్యగ్రమై పోయినదంటారు: ఇటీవల కాంగ్రెస్‌కు సంబంధించి ఒకటి రెండు సమావేశాలు జరిగితే నాయుడుగారు రాలేదు; అలాగే జనార్దనరెడ్డిగారికి కనపడినట్లు లేదు. ఉన్న సంగతులివి. వీటి(బట్టి)ఎవరిపాటికి వారు ఊహించుకోవలసిందే కాని, ఖచ్చితంగా చెప్పగలిగిన స్థితిలో నాబోటివాడు లేడు.

తన వైఖరినిగూర్చి నాయుడుగారే స్పష్టం చేయడం బాగుంటుంది. అంతే కాదు, ఆయన కాంగ్రెస్‌ను వదలిపెట్టకూడదని వ్యక్తిగతంగా నా అభిలాష; ఎలక్షన్ ఓటములు, రాజకీయ ఆశాభంగాలు ప్రసూతి వైరాగ్యం వంటివి. క్షణికోద్రేకంలో వెంకటకృష్ణనాయుడు వంటి వ్యక్తి తొందరపడడం తగదు.

### ఆదివారం ఒకశాపం!

నాబోటివాడికి ఆదివారం ఒకశాపం. నాబోటివాడంటే వర్క్‌షాపులో పనిచేసినోడి, పల్లెటూళ్లో కాపురం వుండేవాడని భావం.

ఆదివారం శాపమేమిటంటారా? ఆరు రోజుల పని తర్వాత విశ్రాంతి దొరికేది ఒక్కరోజు; అది ఆదివారం. విద్యుత్ సరఫరా బంద్ వల్ల విశ్రాంతి సంగతి దేవుడెరుగు, ఆరోజు నరకప్రాయమవుతున్నది. ఎండలెట్లా వుండేది మీకు తెలుసుగదా: ఆ వేడికి కోడు ఫ్యాన్‌కూడా లేకుంటే బ్రతికేదెట్లా? ప్రాణం బేజారెత్తిపోతున్నది; ఆదివారం వస్తున్నదంటే గుండెదడ పుట్టుతున్నది:

ప్రతి సబ్‌స్టేషన్ క్రింద పరిస్థితి ఇదే విధంగా వుందని నేను చెప్పడం లేదు; మా గ్రహచారమేమో, నెల్లూరు సబ్‌స్టేషన్ క్రింద మాకే ఈ దుర్గతి సంప్రాప్తిస్తున్నది. సప్లయ్ వుంటదని ముందుగా చెప్పరు; ఎప్పుడు వస్తుందంటే మధ్యాహ్నంవరకు పన్నెండుకొస్తుందంటారు; ఆ తర్వాత ఐదు ఆరు గంటల వరకు అరగంటల వాయిదా; మూడు నాలుగు వారాలనుండి ఇదే వరస:

ప్లానన్నీ ముఖ్యం కాదు; వ్యక్తిగతంగా నాబోటివాళ్ళ సౌకర్యం ముఖ్యం కాదు; ముందు చెప్పకుండా తమ ఇష్టంవచ్చినంతసేపు కరెంట్ బంద్ చేస్తే రైతులెంత నష్టపోతారో స్థానిక విద్యుత్ ప్రభువులు ఒకింత ఆలోచించాలని మనవి:

### "బర్త్సు" రిజిష్ట్రారు ఆఫీసు

కొత్తల అవతలనోని రిజిష్ట్రారు ఆఫీసు ఎదురుగా ఒకనిమిషం సేపు నిలబడితే నా చూపు ఆ ఆఫీసు ముందు వ్రేలాడుతున్న రెండు బోర్డులలో ఒక దానిమీద పడింది. Office of the Registrar of Births and Deaths – దాని క్రింద తెలుగులో "బర్త్సు రిజిష్ట్రారు ఆఫీసు" అని వుంది. ఇంగ్లీషులో బర్త్సుతో పాటు డెత్స్ అని కూడా వుంటే అనువాదకులు డెత్స్‌ను మింగేశారు. అది పోనీండి; "బర్త్సు ఏమిటి? ఎక్కడి తెగులు? జనన మరణాల రిజిష్ట్రారు కార్యాలయం అని వ్రాయడానికి సరళమైన తెలుగు వచ్చిన వారెవరూ లేరా?

సివాశేగారూ: అధికార భాషగా మీరు తెలుగు అమలుజరుప గలిగితే (అది మీ అధ్యక్ష హయాంలోనే కాదు, మన జీవిత కాలములో కూడా అనుమానమే అనుకోండి) ఆ అధికార తెలుగు తెలుగువారికి అర్థమవుతుందా అని అనుమానం:

### లాటరీల స్వేచ్ఛ!

నెల్లూరులో లాటరీలు; స్కీములు. ఇతర ధన వ్యామోహాన్ని కల్గించే సంస్థలు అసంఖ్యాకంగా పుట్టడం, ప్రజలు వేలం వెర్రిగా తమ డబ్బు తగలేసుకోవడం జరుగుతున్నది. ఇటువంటి సంస్థల్లో ఎన్ని నమ్మకమైనవో, ఎన్ని దివాలాతీత అయినవో, ఎన్ని మధ్యలో బోర్డు త్రిప్పేనో, ఎన్ని అమాయక ప్రజల నోళ్లు కొట్టేవో చెప్పలేము. నెల్లూరుతో ఈ స్కీములు, లాటరీలది పెద్ద లాభసాటి వ్యాపారమైపోయింది:

ఈ సంస్థల్లో దేనికీ బ్యాంకు గ్యారంటీ కాని, ప్రభుత్వ అనుమతి కాని వుండడంలేదు. గ్యారంటీగాని, అనుమతిగాని లేని సంస్థలు ప్రజల డబ్బును గుటకాయస్వాహా చేస్తే, రైట్ రాయల్‌గా మోసంచేస్తే ఎవరు దిక్కు? 'హరిజ' పేరుతో ఒక సంస్థ వెలిసి, శాఖోపశాఖలుగా విస్తరిల్లి, స్కీముల పేరుతో చేసిన వసూళ్ళకాక, అలిండియా పారిశ్రామిక ప్రదర్శనం పేరుతో హోల్‌సేల్ దోపిడికి పథకం వేసి పత్రికల పకాల అందోళనతో విఫలమైన విషయం పాఠకులకు జ్ఞాపకం వుండి వుంటుంది. ఇప్పుడు ఆ హరిజ అడ్రసు లేదు; ఘటనాఘటన సమర్థులైన ఆ ఇద్దరు పమేలా అంతులేరు. ఈవిధంగా వున్న సంస్థలు, ఎన్ని విధాలుగా మోసం చేశాయో; చేస్తున్నాయో తెలియదు.

మొన్న ఉదయాన్నే ఒక పత్రిక తెరిస్తే రెండు కాగితాలు క్రిందపడ్డాయి. ఒకటి ఇండ్లస్థలాల స్కీముకు సంబంధించింది ఇంకొకటి లక్ష్మి ఆట: లాటరీ ప్రియులకు శుభవార్త అంటూ ప్రజలకు పిలుపు ఇచ్చారు. ఆ కరపత్రం "లక్షాధికారులు కావాలని కలలు కంటున్నారా" అంటూ చక్కిలిగిలిపెడుతుంది. సంస్థపేరు, భాగస్తుల పేర్లు అన్నీ వున్నాయి. అందులో ఏడు షరతులున్నాయి వెయ్యమంది సభ్యులట: ఒక్కొక్కరు వంద రూపాయలు చెల్లించాలట, ఆ డబ్బు ఐదేళ్ళలోగా చెల్లించబడదట. ఆ డబ్బుకు లాటరీ టికెట్లు కొనడం వగైరా కార్యక్రమం అంతా ఏదో వున్నదనుకోండి,

వెయ్యమంది నూరు రూపాయలు చెల్లించడమంటే పెద్ద మొత్తమేమీకాదు; అంతా కలిస్తే లక్ష రూపాయలు. సంస్థ మోసం చేస్తుందని, భాగస్తులు నమ్మకస్తులు కాదనే కూడా మా వుద్దేశ్యం కాదు, మొత్తం ఎంతైనా, సంస్థ, భాగస్తులు ఎంత నమ్మకస్తులైనా డబ్బుతో కూడిన ఇటువంటి లాటరీలకు ప్రభుత్వానుమతి, బ్యాంకి గ్యారంటీ వుండడం అవసరం. అవి రెండూలేని సంస్థలను ప్రభుత్వం చెలామణి కానివ్వకూడదు.

**Matrimonial - Bride Wanted**

Wanted a good looking girl from a decent Reddy family for a divorced Reddy Boy from a respectable family aged about 35 years, well educated and well settled in business and residing at Nellore. No dowry. Minimum education is enough. Correspondence will be kept strictly confidential

Please write to : Box No. 278
ZAMIN RYOT, NELLORE - 524 001

# కావలి శాసనసభ ఓట్ల వివరం

[1985 మార్చి 24 తేది జరిగిన కావలి శాసనసభ ఎన్నికల్లో కాంగ్రెస్, తెలుగుదేశం అభ్యర్థులకు వచ్చిన ఓట్ల వివరం బూత్‌లవారీగా దిగువ ఇస్తున్నాము —సం]

| బూత్ పేరు | కాంగ్రెస్ | తె.దే. |
|---|---|---|
| 1 వెలిగండ్ల | 90 | 227 |
| 2 ,, | 103 | 236 |
| 3 మర్రిగుంట | 245 | 154 |
| 4 కొండాపురం | 254 | 193 |
| 5 ,, | 272 | 195 |
| 6 తూర్పుపాలెం | 289 | 290 |
| 7 రేవమాల | 535 | 136 |
| 8 పార్లపల్లి | 171 | 236 |
| 9 పాయిపేట | 259 | 281 |
| 10 ,, | 281 | 247 |
| 11 ,, | 263 | 354 |
| 12 వెల్లటూరివారిపాలెం | 302 | 297 |
| 13 శ్రీ సవరప్పాడు | 282 | 295 |
| 14 కొమ్మి | 368 | 256 |
| 15 ,, | 323 | 266 |
| 16 రామానుజపురం | 199 | 311 |
| 17 వత్యవోలు | 316 | 259 |
| 18 తూర్పుదూబగుంట | 232 | 187 |
| 19 గామగపెంట | 195 | 152 |
| 20 అదిమూర్తిపురం | 137 | 178 |
| 21 తూర్పుబంగాలవల్లె | 340 | 128 |
| 22 చింతలదేవి | 106 | 401 |
| 23 కొత్తతుక్కులూరు | 66 | 291 |
| 24 తెల్లపాడు | 197 | 143 |
| 25 ,, | 216 | 180 |
| 26 చిన్నఅన్నలూరు | 294 | 350 |
| 27 ఏపినాపి | 60 | 275 |
| 28 కుడుములదిన్నెపాడు | 336 | 316 |
| 29 కృష్ణారెడ్డిపాలెం | 155 | 201 |
| 30 ,, | 176 | 181 |
| 31 గంగిరెడ్డిపాలెం | 106 | 156 |
| 32 ,, | 214 | 190 |
| 33 పీరన్నకొల్లు | 269 | 220 |
| 34 నాగసముద్రం | 256 | 128 |
| 35 ,, | 241 | 75 |
| 36 కలిగిరి | 377 | 332 |
| 37 ,, | 398 | 376 |
| 38 ,, | 299 | 120 |
| 39 క్రాకటూరు | 714 | 170 |
| 40 తిరాధివారిపాలెం | 183 | 139 |
| 41 పెదకొండూరు | 451 | 313 |
| 42 పోలంపాడు | 272 | 242 |
| 43 చిద్దనకొండూరు | 122 | 184 |
| 44 ,, | 112 | 283 |
| 45 లక్ష్మీపురం | 331 | 406 |
| 46 సర్రికోట | 352 | 46 |
| 47 అనంతపురం | 547 | 78 |
| 48 గుర్లదావ | 316 | 249 |
| 49 తూర్పుపూడి | 380 | 191 |
| 50 దుండిగం | 233 | 229 |
| 51 మనుబోలుపాడు | 260 | 194 |
| 52 తంగసముద్రం | 459 | 160 |
| 53 రొడిగుడిపాడు | 431 | 287 |
| 54 కాట్రాయపాడు | 371 | 145 |
| 55 లింగాలపాడు | 197 | 213 |
| 56 చిర్నక్రాక | 493 | 338 |
| 57 పేమురపాడు | 186 | 78 |
| 58 కుమ్మరకొండూరు | 313 | 280 |
| 59 అన్నవరం | 307 | 111 |
| 60 ,, | 387 | 101 |
| 61 ,, | 468 | 98 |
| 62 తిమ్మసముద్రం | 344 | 333 |
| 63 చింతలపాలెం | 273 | 265 |
| 64 గట్టుపల్లె | 316 | 234 |
| 65 ,, | 321 | 230 |
| 66 రామసరప్పాడు | 242 | 190 |
| 67 చోరవరం | 284 | 289 |
| 68 జలదంకి | 328 | 334 |
| 69 ,, | 341 | 330 |
| 70 ,, | 355 | 277 |
| 71 ,, | 343 | 213 |
| 72 లింగరాజు అగ్రహారం | 400 | 152 |
| 73 జలదంకి | 298 | 233 |
| 74 బ్రాహ్మణక్రాక | 348 | 250 |
| 75 ,, | 356 | 252 |
| 76 ,, | 235 | 166 |
| 77 కమ్మవారిపాలెం | 315 | 399 |
| 78 హనుమకొండపాలెం | 448 | 70 |
| 79 బ్రాహ్మణక్రాక అగ్ర' | 282 | 179 |
| 80 ,, | 372 | 197 |
| 81 బిరమగుంట | 345 | 227 |
| 82 ,, | 375 | 203 |
| 83 చాదరిపాలెం | 98 | 434 |
| 84 జమ్మలపాలెం | 565 | 270 |
| 85 కొత్తపల్లి | 260 | 150 |
| 86 ,, | 249 | 130 |
| 87 రాజువారిచింతలపాలెం | 361 | 249 |
| 88 చలాచర్ల | 304 | 164 |
| 89 ,, | 234 | 150 |
| 90 లక్ష్మీపురం | 329 | 100 |
| 91 సిరిపురం | 238 | 373 |
| 92 మద్దూరుపాడు | 188 | 311 |
| 93 ,, | 173 | 209 |
| 94 రుద్రకోట | 276 | 264 |
| 95 ,, | 378 | 261 |
| 96 ,, | 228 | 155 |
| 97 చెన్నాయపాలెం | 305 | 578 |
| 98 ,, | 787 | 76 |
| 99 అనెమడుగు | 348 | 134 |
| 100 సర్వాయపాలెం | 498 | 252 |
| 101 ,, | 276 | 293 |
| 102 ,, | 274 | 252 |
| 103 కావలి | 371 | 359 |
| 104 ,, | 252 | 265 |
| 105 ,, | 127 | 161 |
| 106 ,, | 319 | 345 |
| 107 ,, | 230 | 198 |
| 108 ,, | 219 | 181 |
| 109 ,, | 392 | 364 |
| 110 ,, | 195 | 190 |
| 111 ,, | 152 | 217 |
| 112 ,, | 400 | 417 |
| 113 ,, | 341 | 321 |
| 114 ,, | 259 | 371 |
| 115 ,, | 287 | 227 |
| 116 ,, | 439 | 232 |
| 117 ,, | 160 | 235 |
| 118 ,, | 152 | 264 |
| 119 ,, | 308 | 252 |
| 120 ,, | 297 | 280 |
| 121 ,, | 262 | 212 |
| 122 ,, | 207 | 224 |
| 123 ,, | 186 | 293 |
| 124 ,, | 328 | 319 |
| 125 ,, | 356 | 239 |
| 126 ,, | 251 | 228 |
| 127 ,, | 249 | 196 |
| 128 ,, | 401 | 225 |
| 129 ,, | 260 | 173 |
| 130 ,, | 388 | 248 |
| 131 ,, | 261 | 158 |
| 132 ,, | 284 | 151 |
| 133 ,, | 389 | 254 |
| 134 ,, | 400 | 281 |
| 135 ,, | 372 | 182 |
| 136 ,, | 353 | 190 |
| 137 ,, | 368 | 324 |
| 138 ,, | 360 | 245 |
| 139 అముదాలదిన్నె | 269 | 347 |
| 140 మన్నంగిదిన్నె | 265 | 337 |
| 141 ముసునూరు | 483 | 273 |
| 142 ,, | 419 | 272 |
| 143 ,, | 374 | 293 |
| 144 చెంచుగానిపాలెం | 44 | 392 |
| 145 తాళ్ళపాలెం | 214 | 239 |
| 146 ,, | 323 | 305 |
| 147 ,, | 497 | 123 |
| 148 కొత్తసత్రం | 295 | 341 |
| 149 తుమ్మలపెంట | 379 | 190 |
| 150 ,, | 373 | 172 |
| 151 ,, | 237 | 332 |
| 152 మామిళ్లదొరువు | 390 | 201 |
| 153 అన్నగారిపాలెం | 445 | 362 |
| 154 ,, | 367 | 327 |

## ఊరూ–పేరూ

(4వ పేజీ తరువాయి)

మాపులంటారు:

కోట గ్రామానికి చుట్టుపట్ల కొన్ని సంవత్సరముల క్రిందటి వరకు కందక చిహ్నములు కనుపడేవట, కోట పున్నదేవత వుండుటచేతను: ఒకప్పుడు యిచట కోట వుండుటచేతను యీ గ్రామానికి 'కోట' అని పేరొచ్చినట్లుచెబుతారు.

ఇచ్చట 1963 ప్రాంతములో పల్లపు రెడ్డి చంద్రశేఖరరెడ్డిగారి ప్రయత్నంలో కొన్ని జైన విగ్రహాలు దొరికాయి. జైనమతం శాతవాహనుల కాలం (క్రీ. పూ. 225 క్రీ శ 225) నుండి. తూర్పు చాళుక్యుల కాలం (క్రీ. శ 7 శతాబ్ది నుండి 11వ శతాబ్దం వరకు) ఆంధ్రదేశంలో రాజాదరణను నోచుకుంది. పల్లవులలో ప్రముఖుడైన, మొదటి మహేంద్రవర్మ (క్రీ. శ. 600 - 625) జైనమతాన్ని ఆదరించాడు. నెల్లూరు జిల్లా మహేంద్రవర్మ కాలానికి పల్లవుల అధికార ప్రాభవానికి లోబడి వుందని చెప్పవచ్చు. ఇచ్చటనేకాక, వాకాడు, నెల్లూరు, కృష్ణాపట్నంలలో కూడా జైన విగ్రహాలు లభించాయి; కనుక తిపాడు ఒకప్పుడు జైనమత కేంద్రంగా వుండింది.

### కోట పోలూరు

శిథిలమైన కోట చిహ్నములు యిచ్చట కనుపిస్తాయి. కోట ప్రక్కన గ్రామాన్ని ఏర్పాటు చేసుకొన్నందున కోట ప్రోలూరు (కోట పోలూరు) అయినది. ప్రోలు అంటే పట్టణం, కోట ప్రోలూరు అంటే కోట పట్టణం అన్నమాట

పై రెండు గ్రామాలు మంచి సారవంతమైన భూములు గల ప్రదేశాలు భాగ్యవంతులుండే గ్రామాలు

ఇంకా ఆత్మకూరు తాలూకాలో, కోటపాడు, వెంకటగిరి తాలూకాలో పాలెం కోట అనే గ్రామాలున్నాయి. వాటిని గూర్చి మళ్ళీ చర్చించుకుందాము.

## జీవనసమీక్ష

(9వ పేజీ తరువాయి)

ముళ్ళపూడి వెంకటరమణ మాటలు ఏవో కొద్దితప్ప మొత్తంమీద చప్పగానె వున్నాయి, వేటూరి పాటలు గూడా అంతంతమాత్రంగా వున్నాయి. బాలసుబ్రహ్మణ్యం సంగీతం డిటోడిటో.

## త్యాగయ్య

(9 పేజీ తరువాయి)

బాగా ఆకర్షించింది, ఐటీ పట్టిన కీర్తనలే అయినా రాగయుక్తంగా ఆలపించారు. రామకృష్ణారావుగారు.

కమలాంబ పాత్రధారిణి, రేడియో కళాకారిణి శ్రీమతి సరస్వతీ లక్ష్మణన్ కర్ణాటక సంగీతంలో సంధితురాలు కావడంతో, నాటకంలో కాఫీ సుసరంగా సంగీతం లేదన్న కొరత లేకుండా పోయింది.

ఐతే కొన్ని సన్నివేశాలను అనవసరంగా సాగదీసి, ప్రేక్షకులను విసుగెత్తించారు. హాస్యం కోసం ప్రవేశపెట్టిన సుందరమ్మ పాత్ర కృతిమంగా ఉంది. త్యాగయ్యకు కీర్తి తెచ్చిన 'తెరతీయగరాదా' వంటి కీర్తనలు కొన్నింటిని విస్మరించడం, కొట్టొచ్చినట్లు కన్పించే లోపం.

బాలాజీనగర్ శ్రీ త్యాగరాజ నాట్య మండలి ప్రదర్శించిన ఈ నాటకానికి రచయితలు శ్రీ టి. ఏ. పద్మనాభరావు, శ్రీ వి. వి. సుబ్రహ్మణ్యం, దర్శకులు శ్రీ డి.వి. సత్యమూర్తి శ్రీయుతులు కె. వి. మధుసూదనరావు, వి. బాలచంద్ర, కొండి వెంకటరమణయ్య, ఎం. అవధాని, శ్రీమతులు ఎం. చంద్రదేవి, సరస్వతి లక్ష్మణన్ తదితరులు నటించారు.









నెల్లూరు ప్రిన్సిపల్ డిస్ట్రిక్ట్ మున్సిఫ్ కోర్టులో
E. P. No. 61/80
O. S. No, 569/72

డివిజనల్ పంచాయత్ ఆఫీసరు —వాది/DHR

పాములూరు వేణుగోపాలరెడ్డి —ప్రతివాది/JDR

యింకు మూలముగా తావన్మందికి తెలియజేయడమేమనగా యీ క్రింది షెడ్యూలు దాఖలా చరాస్తి పై కోర్టువారి యెదుట 12-6-85వ తేదీన ఉదయం 11 గంటలు మొదలు సాయంత్రం 5 గంటల లోపల యాలం వేయబడును. పాటదారులు పాట పెట్టుకొనేది.

షెడ్యూలు

నెల్లూరు రి. డి, నెల్లూరు తా, యిడిమేపల్లి గ్రామంలోని ప్రతివాది / JDr. తాలూకు పట్టా నెం. 429 కు. సర్వే నెం. 218 గల పూర్తి య. 4-76 సెంట్ల లోని య. 2-00 ల భూమిమాత్రం.

హద్దులు

తూర్పు: పాములూరు వేణుగోపాలరెడ్డి భూమి, పడమర: కుక్కా నరసింహభూమి ఉత్తరం, దక్షిణం :- పాములూరు చంద్రశేఖరరెడ్డి భూమి.

DHR విలువ :- రు. 10,000/-లు
అమీను విలువ :- రు. 15,000/-లు

F. H. తే 19-6-85 ది

— సి. సుందరరామిరెడ్డి
వాది తరపు అడ్వకేటు

# నెల్లూరు కల్యాణి A.C. లో రోజూ 3 ఆటలు

# నాల్గవ వారం

హౌస్‌ఫుల్ కలెక్షన్స్‌తో దిగ్విజయంగా ప్రదర్శింపబడుతున్న చిత్రం

మెచ్చిన చిత్రాలు...

మంగమ్మగారి మనవడు

అపరాధి

ముక్కుపుడక

మనిషికో చరిత్ర

భార్గవ్ ఆర్ట్ ప్రొడక్షన్స్

# మాపల్లెలో గోపాలుడు

S. గోపాల్‌రెడ్డి B.Sc (Ag) కోడిరామకృష్ణ

- నెల్లూరు కళ్యాణి ఫిలింస్

Edited, Printed & Published by N. Sesa Ramamurthy at The Zamin Ryot Press, Thippasajuvari Street, Nellore (A. P.)